# నూరు ప్రశ్నలకు

# రమణ మహర్షి సమాధానాలు

సంకలనము మరియు సవరించినవారు :

శ్రీ ఎ.ఆర్.నటరాజన్

తెలుగు అనువాదం :

శ్రీ చిక్కాల కృష్ణారావు

ప్రచురణ :

శ్రీ రమణ నిలయాశ్రమం,

వేల్పూరు - 534 222.

(వయా)తణుకు, ప॥గో॥జిల్లా.

పోస్ట్ ఆఫీస్ రోడ్, సంజయ నగర్,
బెంగళూరు - 500 094,
ఫోన్ : (080) 23512639, 23514930.

శ్రీ ఎ.ఆర్. నటరాజన్, బెంగళూర్,
శ్రీ చిక్కాల కృష్ణారావు, విశాఖపట్నం
వారి అనుమతితో...

ISBN - 81 - 85378 - 66 - 5

ముద్రణ : అక్టోబర్ 2004

కాపీలు : 5,000

డి.టి.పి. & ముద్రణ : శ్రీ వెంకటరాయ ప్రింటర్స్ (ప్రై.) లిమిటెడ్
తణుకు - 534 211. ఫోన్ : 224203

ఉచితం (FREE)

# ముందుమాట

భగవాన్ రమణ మహర్షి జీవితం చాలావరకు మౌనంగా గడచింది. కాని, వారు కొన్ని సమయాల్లో ఆర్తుల అవసరమైన ప్రశ్నలకు సరైన, సూటైన సమాధానాలు ఇచ్చారు. ఆ సమాధానాల్ని దీక్షగా, మంత్రంగా, ఉపదేశంగా భావించి తరించిన వారెందరో వున్నారు.

రమణ మహర్షి అరుణాచలం (తిరువణ్ణామలై) వచ్చి 1996 - సెప్టెంబరు ఒకటవ తేది వంద సంవత్సరాలు అయినది. అందుచేత - 1997 సెప్టెంబరు ఒకటవ తేదీ వరకు - భగవాన్ జ్ఞానోదయ శతాబ్దిగా కొన్ని పుస్తకాలు, సావనీర్లు, కరపత్రాలు విడుదల చేస్తున్నారు, అనేక చోట్ల. బెంగుళూరు రమణ సెంటర్ ఫర్ లెర్నింగ్ నుంచి *"Ramana Maharshi Answer-100 Questions, Edited & Compiled by A.R. Natarajan"* గారి పుస్తకం. అందులో జ్ఞాని, జ్ఞానం, మనోనిగ్రహం, సహజ సమాధి, ఆత్మసాక్షాత్కారం, గురువు, శాంతి, జన్మ-పునర్జన్మ, భగవంతుడు - మొదలైన అంశాలపై తగినంత కాంతిని ప్రసరింప జేసినట్టి ఓ వంద ప్రశ్నోత్తరాలు ఎంపిక చేయబడ్డాయి. భక్తి - శ్రద్ధలతో కూడిన నటరాజన్‌గారి కృషి ప్రశంసనీయమైనది.

నటరాజన్‌గారు తాను తయారు చేసిన భగవాన్ తత్వనిరూపణ పుస్తకాల్ని నన్ను అనువదించమనడంలో ప్రత్యక్షంగా వారి ప్రోత్సాహం, పరోక్షంగా భగవాన్ ప్రేరణ వున్నాయనిపిస్తోంది.

ఈనా అనువదాల్లో ఎప్పుడూ ఆధ్యాత్మిక విషయ వివరణలు ఇచ్చే స్వామి యోగానంద గారికి, సాహిత్య పరమైన చక్కని సలహాలు ఇచ్చే నాగమణిగారికి నా హృదయపూర్వక అభినందనలు.

భీముని పట్నం
24-5-1997

చిక్కాల కృష్ణారావు

# పరిచయం

రకరకాల మనస్తత్వం కల సాధకులు - సందర్శకులు, భక్తులు ఎటువంటి అలమరికా లేకుండా రమణ మహర్షిని అడిగిన అనేక రకాలైన ప్రశ్నలకు - ఆ ప్రశ్నలు చాలా వరకు తమ ఆధ్యాత్మిక సాధనలో కలిగిన ప్రగతి - పురోగతిపైనే కాక - తమ దైనందిన జీవితానికి సంబంధించిన ప్రశ్నలకు సహితం భగవాన్ నుంచి సరైన, సూటైన సమాధానాలు పొందేవారు. ఆయన ప్రతి ఒక్కరికి అన్ని వేళలా సులభంగా అందుబాటులో వుండటమే కాక - స్వేచ్ఛగా తమ సమస్యల్ని విన్నవించుకుని తగిన సమాధానాలు పొందే అవకాశాన్ని కల్పించారు భగవాన్. ఆ విధంగా యాభై నాలుగేళ్ళు గడిచాయి. అంత సుదీర్ఘకాలంలో భగవాన్ ఎన్ని ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చి వుంటారో ఊహించలేము. బహుశా అవి దాదాపు ముప్ఫైవేలు వుండవచ్చు.

ప్రతిరోజు అసంఖ్యాక భక్తులతో, సాధకులతో, సందర్శకులతో రమణ మహర్షి జరిపిన సంభాషణలు, చేసిన భాషణలు, ప్రశ్నోత్తరాలు, ఇంకా ఇంకా అనేక విషయాలు, సంగతులు - వాటిన్నింటినీ ఎవరైనా చదివితే - ఆధ్యాత్మిక మార్గంలో బహుముఖంగా ఎదురయ్యే సమస్యలన్నింటినీ పూర్తిగా అర్థం చేసుకోగలుగుతారు. ఇంక వారు ఏదీ అధ్యయనం చేయవలసిన, అన్వేషించవలసిన అవసరం లేదనిపిస్తుంది.

బెంగుళూరు రమణ మహర్షి సెంటర్ ఫర్ లెర్నింగ్‌నుంచి ఇంగ్లీషులో వెలువడే **The Ramana Way** -రమణుని మార్గం' మాసపత్రికలో - భక్తులు

భగవాన్ని అడిగిన ప్రశ్నలు - ఆయన ఇచ్చిన సమాధానాలు గత రెండేళ్ళుగా ప్రచురించడం జరిగింది. అవి పాఠకులలో ఎంతో ఆసక్తిని కలిగించాయి. అందులోంచి ఓ వంద ప్రశ్నోత్తరాలు ఎన్నిక చేసి, సాధారణ ప్రజానీకానికి - సాధకులకు - భక్తులకు వీలైనంత తక్కువ ధరలో అందివ్వాలనే ఉద్దేశ్యంతో చిన్న పుస్తకంగా రూపొందించడం జరిగింది. రమణ మహర్షికి జ్ఞానోదయమై వంద సంవత్సరాలు నిండిన సందర్భంలో బెంగుళూరు రమణ మహర్షి సెంటర్ ఫర్ లెర్నింగ్ వారు భగవాన్ తత్వ నిరూపణగల పది పుస్తకాలు తీసుకు రావాలనుకున్నారు. వాటిల్లో ఇది రెండవది.

భగవాన్ బోధనల్లో వజ్రపు తునకలు వంటి ఎన్నో సంగతులు - విషయాలు ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. వాటిని అధ్యయనం చేస్తే ఎంతో ఆనందాన్ని ఇస్తాయి.

బెంగుళూరు

13-7-1997

ఎ.ఆర్. నటరాజన్

# కృతజ్ఞతలు

శ్రీ రమణాశ్రమము ప్రచురణలలోని అంశాలను ఈ పుస్తకములో ఉపయోగించుటకు ప్రెసిడెంట్ శ్రీ వి.ఎస్. రమణన్‌గారు దయతో అనుమతించారు.

శ్రీ చిక్కాల కృష్ణారావుగారు మేము కోరగానే ఒప్పుకొని శ్రద్ధతో ఈ పుస్తకమును అనువదించినారు. శ్రీ కృష్ణగారు మాధుర్యమైన తెలుగుభాషను చాల చక్కగా ఉపయోగించినారు.

శ్రీ సత్యనారాయణగారు ప్రూఫ్‌ను జాగ్రత్తగా సరిచూసినారు.

కవరును శ్రీ మురళీధర హెగ్డేగారు ఆకర్షణగా తీర్చిదిద్దినారు.

సెట్టైప్ గ్రాఫిక్స్ ఇండియావారు డి.టి.పి.టైప్ సెట్టింగ్‌ను చక్కగా అందించినారు.

ఆరిద్రా ప్రింటర్స్‌వారు ఈ పుస్తకమును అందంగా ప్రింట్ చేసినారు.

వీరందరికి మా కృతజ్ఞతలు.

ప్రెసిడెంట్

రమణ మహర్షి సెంటర్ ఫర్ లెర్నింగ్

బెంగళూరు.

## భగవాన్ రమణుని సమాధానాలు

1. నా పాప భారం నన్ను కృంగదీస్తోంది. దాన్నించి బైట పడే మార్గం ఏమిటి?

భగవాన్ - "నేను అపరిశుద్ధుణ్ణి - అపవిత్రుణ్ణి" అనే భావాన్ని వదలు. ఆత్మ నిత్యశుద్ధం. అదంతా మనోవికారం. వికల్పాలు మనస్సు మూలాన్ని చేరగలిగితే అప్పుడా తప్పుడు అభిప్రాయాలు అదృశ్యమగును.

## జ్ఞాని - జ్ఞానం

2. దేహంలో జ్ఞాని అగుపడతాడా?

భగవాన్ - ఎందుకు అగుపడడు? శరీరం మనస్సు యొక్క ప్రతిబింబం. అందుచేత - ఆ మనోకదలిక వల్ల ఆ దేహంలో అనేక విధాలైన పరిణామాలు, మార్పులు - దిద్దుబాట్లు - సవరణలు కలుగుతాయి.

జ్ఞానియొక్క దేహంలో మార్పులు ఎవరి దృష్టికి కనుపిస్తుంది?

బైట విడిగా చూసేవాని దృష్టికి.

అలాగైతే జ్ఞాని అగోచరుడై వుండవలెనా?

గ్రంథాలు రచించి - జీవించి - చలించే వారంతా అజ్ఞానులై వుండవలె. అదీ అంతేనా?

అందరూ నవ్వారు.

దేహభారాన్ని మోస్తున్నట్లు జ్ఞాని అనుకుంటాడా? ఇతరులు తన దేహాన్ని చూడ్డంలేదనే దానికి నిదర్శనగా ఎదుటి వారినుంచి జ్ఞాని యోగ్యతాపత్రం పొందాలా?

అక్కర్లేదు.

ద్రష్ట ఎవరు?

మొదట ఆ సమస్యను పరిష్కరించండి. దేహం కనుపించుటలోను, కనుపించకపోవుటలోనూ విశేషం ఏమీలేదు.

3. భక్తుడు సాధారణంగా జ్ఞానినుంచి తప్పించుకు తిరగడానికి తరచు ప్రయత్నిస్తాడు. కారణ ఏమిటి? లక్ష్యం చేరి కూడా వారు అలా చేస్తారు.

భగవాన్ - నువ్వు ముందు చెప్పిన ఆ నీ అభిప్రాయమంతా తప్పు. ఎందుకంటే భక్తుడు - జ్ఞానిని చేరగానే అతడు జ్ఞానితో ఏకీభవిస్తాడు. ఎందుకంటే - భక్తుడు ప్రేమపూరితుడు. జ్ఞాని జ్ఞానస్వరూపుడు. ఇద్దరూ ఒకటే - ఏకమే. ఈ తగవులు నిజంగా శుష్కభక్తుల - మిథ్యా జ్ఞానులవల్ల కలిగే పొరపాటు పోరాటాలు.

4. జ్ఞానికి ఎంత సేపు నిద్ర అవసరం?

భగవాన్ - "నేను నిద్రనుండి మేల్కొన్నాను" అనుకునే వారికి నిద్ర అవసరం. కాని నిత్యం - మార్పులేని సుఖనిద్రలో వుండువారికి ఇతరమైన నిద్రలో ఎటువంటి పనీ లేదు. కంటి రెప్పలు అలసినప్పుడు

కొంత సేపటికి వాటికవే మూత పడతాయి. జాగ్రత-స్వప్న-సుషుప్తి అవస్థలు మూడూ మనసుకే కాని, దేహానికి కాదు.

5. నారద భక్తిసూత్రాలు భక్తి మార్గమే శ్రేష్ఠమని చెపుతున్నాయి. జ్ఞానమార్గం గురించి కూడా మనం అలాగే చెప్పవచ్చు కదా? అందులో బేధం ఏమిటి.

భగవాన్ - జ్ఞానమే - భక్తి.

6. అష్టావక్ర గీత 9వ అధ్యాయం - 4వ శ్లోకంలో జరగవలసిన పనులు వాటికవే జరుగుతాయి. వాటి వెనుక ఎటువంటి కారణం లేకుండా కార్యం దానికదే జరుగుతుందా?

- వర్తమానంలో ప్రయత్నం - కోర్కె లేకుండా మనిషికి ఏదైనా ఒక పని జరిగింది అంటే అది వాని ప్రారబ్దకర్మను బట్టి జరుగుతుంది. ఏ కోర్కె లేని జ్ఞానికి కూడా అటువంటి కర్మలు తటస్థపడతాయి.

అష్టావక్రగీతలో - జ్ఞాని - తాను చేసింది - చెయ్యనిది - చేయవలసింది - వాటి గురించి చింతించడు.

దాన్ని అర్థం చేసుకోవడం ఎలా?

జ్ఞాని తాను చేసే కర్మకు తాను కర్తను అనిగాని, చెయ్యని దానికి అకర్తను అని గాని భావించడు. అంటే -కర్మను చేశాను అని కాని, కర్మచేయడం మానేశాను అనికాని తలంపు, జ్ఞానికి కలగదు.

7. జ్ఞానియొక్క ప్రారబ్ధం ఎందుకు దహించకుండా వుంది?

- జ్ఞానిదృష్టిలో కర్మ లేదు - కర్తా లేడు. కాని, లోకుల దృష్టిలో జ్ఞాని దేహం కర్మవశమని తోస్తుంది, చూసేవారికి. దాన్ని ప్రారబ్ధానికి అంటకడతారు, అంతే!

పురాణాల్లో జ్ఞానులు - జ్ఞానులతో తగవులాడినట్లు కనపడుతుంది. అది వారి - వారి ప్రారబ్ధ కర్మా?

అవును. కృష్ణుడు భీష్మునితో పోరాడాడు.

8. జ్ఞానికి వైరాగ్యం వుండాలి కదా? తికమకలకు కారణం?

కోర్కెలే కదా? పూర్ణవైరాగ్యమే, జ్ఞానం.

బాహ్య దృష్టికి - ఒకరి వైరాగ్యం - శరణాగతి పరిపూర్ణమైనవని బైటనుంచి మనం ఎట్లా నిర్ణయించగలం?

- పూర్ణవైరాగ్యం - జ్ఞానం వున్నవారు పరీక్షించి - నిర్ణయించడానికి - లేక తెలుసుకోవడానికి వారికి బైట - విడిగా, అన్యంగా ఎవరున్నారు?

9. మీ అనుగ్రహం వలన - జ్ఞానం సంపాదించి, దాన్ని ప్రపంచ ప్రజలకు మేము బోధించగలమా?

- ముందు నిన్ను నీవు తెలుసుకో. ఇతరులకు ఉపదేశించాలనే - బోధించాలనే భావాన్ని వదులు, సాక్షాత్కారానంతరం ప్రపంచం - ప్రజలు మిగిలివుంటే - నీవు వాళ్ళకు ఉపదేశించవచ్చు - బోధించవచ్చు.

నిన్ను నీవు తెలుసుకోకుండా ప్రపంచానికి సహాయం చేయ యత్నించడం - ఎదుటి వానికంటిలోని రోగాన్ని నివారించడానికి యత్నించినట్లు వుంటుంది. ముందు నీ కళ్ళను శుభ్రంచేసుకో. అలా చేస్తే ఇతరుల కళ్ళు కూడా నీ కళ్ళుమాదిరిగానే చూస్తావు. అప్పుడు ఇతరుల కళ్ళు - నీ కళ్ళు మాదిరిగా చూసినట్లయితే - అప్పుడు వారికి సహాయం చేయకుండా ఎలా వుండగలవు?

## జపం - తపం - ధ్యానం

**10.** మంత్ర జపం చేయడం వలన లాభం ఏమిటి?

- మనస్సుకు అదొక ఆట - వేడుక - వినోదం - మరపు - దాన్ని మార్గం నుండి మళ్ళించడం. అతి వేగంగా ప్రవహించే ఆలోచనలకు మనస్సొక మార్గం. ఆలోచనా ప్రవాహాన్ని అవసరమైనట్టి చోటుకు మళ్ళించడానికి మంత్రజపం ఓ ఆనకట్ట వంటిది.

**11.** కొన్నేళ్ళ క్రితం నాకు రెండు మంత్రాలు ఉపదేశింపబడ్డాయి. ప్రతిరోజు వాటిని కొన్నిసార్లు ఉచ్చరించమని శాసించారు. నేను వాటిని సకాలంలో శ్రద్ధగా జాగ్రత్తగా చేస్తూ వచ్చాను. కాని, నేను ఇప్పుడు ఇక్కడకు - శ్రీ రమణాశ్రమంలో అడుగు పెట్టిన తర్వాత మంత్ర జపం చెయ్యాలని నాకు అనిపించుట లేదు. నా ఉపదేశం నిబంధనను ఆచరించకపోవడం వల్ల కలిగే ప్రమాదం గురించి భయపడుతున్నాను. నా తప్పు భగవాన్ ముందు నివేదిస్తున్నాను.

భగవాన్ నాతో ఇలా అన్నారు - నువ్వు ఇంత కాలం చేసినట్టి మంత్ర జప ఫలితమే నిన్ను ఇక్కడకు తీసుకువచ్చింది. ఆ మంత్ర జపం ఫలితం ఇప్పుడు - ఇక్కడ అనుభవిస్తున్నప్పుడు - ఎందుకు భయపడుతున్నావు?

12. విచారమార్గం - ఆత్మ విచారణ - పవిత్ర శ్లోకపఠన - మంత్రజపం వాటి మధ్య వున్న సంబంధం ఏమిటి? విచారమే మంత్రం, జపం, తపం, త్యాగం, యోగం. అయితే విచారమార్గం అనుసరించువారికి ఈ మంత్రజపం అనవసరమా?

- అన్ని మంత్రాలసారం - మంత్ర మూలం, విచారణే. మంత్రం మీద ఆసక్తి వుండకూడదని అర్థం. అంటే! అది దాన్ని అడ్డగించదు.

13. ఒక్కోసారి నాకు తెలియకుండానే విచారణ - జపం ఒకదాన్ని ఒకటి అధిగమించి దాటి పోతాయి. అప్పుడు నేనేం చెయ్యాలి?

- గత అభ్యాస ఫలితంగా - అప్రయత్నంగానే అవి జరుగుతాయి. కాని "నేను" అనేది లేకుండా విచారం గాని, జపంగాని జరుగుతుందా?

ఉభయ మర్గాల్లో సాధకుడు తన శ్రద్ధను అహంమూలం మీదగాని, మంత్రం మీదగాని వుంచాలి.

14. విచారణ చేస్తూ వుండగానే ఒక్కొక్కప్పుడు సాధకుడు శూన్యావస్థకు చేరుతున్నాడు.

- శూన్యం చూసినా, పూర్ణం చూసినా - వాటిని చూడ్డానికి ఒకరు వుండాలి కదా? శూన్యాన్ని చూసి, కనుక్కునే వానిని ముందు తెలుసుకో. దానికి జవాబు - "నేను" అని వస్తుంది. అప్పుడు ఆ "నేను" ఎవరో తెలుసుకో. విచారణ చేసే అలవాటు వల్ల కలిగే ఆ శూన్యత - అప్పుడు కనుపించదు. ఎటువంటి దృశ్యం కనుపించినా - "అవి ఎవరికి?" అని ప్రశ్నించుకోవాలి. అప్పుడు శేషించునది - 'నేను' మాత్రమే.

**15.** నేను మీ విచార మార్గం గురించి విన్నాను. కాని నాకు దాని గురించి సరైన అవగాహన లేదు. ఒక ప్రశాంత ప్రదేశంలో కూర్చుని 'నేనెవడను?' అని మళ్ళా, మళ్ళా ప్రశ్నించుకోవడమా? లేక - దాన్నే ఒక మంత్రంగా గాని, ఆ ప్రశ్న మీద ఆలోచించడం గాని చేయాలా?

- కాదు. అది ప్రశ్న వేయడం కాదు. "నేనెవడను?" అని ధ్యానం చేయడం కాదు. అది - నీ ఆంతర్యంలోకి నువ్వు మునిగి - ఈ 'నేను' అనే ఆలోచన - ఈ అహం మూలం ఎక్కడనుంచి పుడుతుందో - దాన్ని వెదకడం. ఇంక ఏ ఇతర తలంపు చొరబడకుండా దాన్ని గట్టిగా పట్టుకోవడం. ఎడతెగని శ్రద్ధతో కూడిన ప్రయత్నమే నిన్ను అక్కడకు చేరుస్తుంది.

**16.** 'విచారసంగ్రహం' అనే వేదాంత గ్రంథం - కఠిన ఉపవాసం చేయమని గట్టిగా నొక్కి చెపుతోంది. దాని గురించి మీరు కొంత తెలియపరచండి.

- నువ్వు పూర్తిగా ఆహారం - నీరు తీసుకోవడం మాని వేయాలని కాదు, దాని అర్థం. దేహానికి ఎటువంటి ఇబ్బంది కలిగించకుండా, ధ్యానానికి అనుకూలమైనట్టి మితాహారాన్ని భుజించాలని దాని అర్థం.

17. నా ప్రస్తుత పశుస్థితినుంచి నేను ఎదగడం ఎలాగ? ఆ విషయంలో నా సొంత ప్రయత్నం నిష్ఫలమైపోయింది. నన్ను మించిన ఒక దివ్యశక్తి నాకు సహాయపడగలదని నిర్ధారణ చేసుకున్నాను. అదే నన్ను ఇక్కడకు తీసుకొచ్చింది.

- నువ్వు అనుకున్నది నిజమే. ఇంద్రియాలు - మనస్సు కంటే అతీతమైనట్టి శక్తి మేల్కొన్నపుడే అవి నిగ్రహింపబడుతాయి. నీలోని ఆ శక్తిని నువ్వే మేల్కొల్పి - దాన్ని పోషించి, పెంచితే అదే అన్నింటిని జయించవచ్చు. ఎడతెగని ధ్యాన ప్రవాహం కొనసాగించాలి. అంతరంగిక ప్రశాంతతను సరళంగా కొనసాగించుటకు - మితాహారం నిగ్రహం అవసరం.

18. ధ్యానమును కోరుట వలన మనసుకు లాభం ఏమిటి? ఇక్కడంతా వంట పనే.

- కాళ్ళు, చేతులు వాటి వాటి పనులు వాటిని చేసుకోనియ్యి. నువ్వు కాళ్ళు, చేతులు కాదు. నువ్వు కదలని శక్తివి. ఆ సత్యానికి ఎరుకలో లేనంత వరకు సమస్యలు అంతులేకుండా వుండనే వుంటాయి. నువ్వు దేహతాదాత్మ్యం పొందినప్పుడు - నీకు ద్వైతభావం కలుగుతుంది. అప్పుడు పనీ భారంగా తోస్తుంది. పని చేయకుండా

గంలో
వూరుకుంటే - మనసు పరిగెత్తకుండా వూరుకుంటుందా? అది నిన్ను సుఖంగా నిద్రించనివ్వదు. జాగ్రదవస్థలో కూడా కలలో లాగ నిన్ను పరిగెత్తిస్తూనే వుంటుంది.

**19.** నేను ధ్యానం చేస్తున్నప్పుడు - నిద్ర నన్ను గెలిచి అణచేస్తుంది. దాన్నించి తప్పించుకోలేకపోతున్నాను. నన్ను ఏం చేయమంటారు?

- "నేను మేల్కొన్నాను" అంటే "నేను నిద్రపోయాను" అని అర్థం. మెలకువ వచ్చిన తర్వాత మనం జాగ్రత-సుషుప్తిలో వుండవలె. నిద్ర వచ్చినపుడు మనం మేల్కొని వుండవలెను. అదే - మెలుకువతో కూడిన నిద్ర అదే జాగ్రత - సుషుప్తి.

అది నాకు సాధ్యంకాదు.

"అది నాకు సాధ్యం కాదు" అనుకోవడానికి కారణం, ఆలోచన. అదే పెద్ద అవరోధం.

**20.** ఆలోచన గట్టిగా పట్టుకుని వూపుతున్నప్పుడు, ఏం చేయమంటారు?

- ఆలోచన నిన్నేమీ పట్టుకుని వూపుట లేదు. ఆలోచనే మనల్ని పట్టుకుని వూగుతుంది.

అదే వాస్తవమైతే - నేను మనస్సును ఎలా నిగ్రహించేది?

- మనస్సును నిగ్రహించాలనేదాంట్లో - మనోనిగ్రహానికి మరో మనస్సు అవసరమని తెలుస్తోంది. మనోనిగ్రహానికి యత్నించడం -

తన నీడను తాను కొలుచుకోవడానికి యత్నించినట్లు వుంటుంది. అది అసాధ్యం. - మనం నిద్రలో ఎలా వుంటాం? నిద్రపోతున్నప్పుడు కూడా మెలకువలో మాదిరిగా 'నేను' అనేది వున్నా - నిద్రలో 'నేను' దేహ, మనో రహితంగా వుంటుంది. ఆ 'నేను'ను వదలి 'దేహాన్ని' - 'నేను' అనుకోవడమే మనం చేసే మొదటి తప్పు.

**21. ధ్యాన సమయంలో నిద్రరాకుండా చేయడానికి సాధన ఏమిటి?**

- ధ్యానం చేసేవారు ఎక్కువ దేహశ్రమ చేయరాదు. అమితంగా ఆహారం భుజించరాదు. కడుపునిండా తిన్నప్పుడు - మానసిక స్థితి దిగజారుతుంది. కడుపు పూర్తి ఖాళీగా వుంటే, సాధకుడు ఆధ్యాత్మికంగా ఎదుగుతాడు. వీణతీగలు ఎక్కువగా బిగించకూడదు. వదలుగా వుంచరాదు. సమస్థితిలో వుంచాలి. దేహాన్ని అదే విధంగా వుంచాలి. అలాగే నిద్ర కూడ మితంగా పోవాలి. మూడో వంతు రాత్రి మాత్రమే నిద్రకు కేటాయించబడింది. రాత్రి పదిగంటలకు పడుకుని - ఉదయం రెండుగంటలకు లేవాలి. పగలు నిద్రపోకూడదు. ఇంకో మార్గం కూడా వుంది. నిద్ర వచ్చినప్పుడు పడుకోవడం - మెలకువ రాగానే లేవడం, కాని 'నిద్ర పోవాలి - లేవాలి' అని అనుకోకూడదు. అని - అప్పుడు "దేవీకాలోత్తర నుంచి 33వ శ్లోకం చెప్పారు భగవాన్. మనస్సు ఊహల్లో పడిపోతుంది. లేదా - నిద్రలోకి జారుకుంటుంది. ఎరుకలో - మెలకువలో వుండు. దాన్ని తిరిగి - తిరిగి పూర్వపు స్థితికి తీసుకువెళ్ళాలి.

22. ధ్యాన సమయంలో నాకు వెన్నెముకలో - రొమ్ము భాగంలో నొప్పివస్తోంది. అది దేవుడి పరీక్ష అంటారా? భగవాన్, అది నిజమా - కాదా? నాకు వివరించి చెప్పండి.

- మీరు ఏది పరీక్ష అంటున్నారో - అది - నాడులపై - పంచేంద్రియాలపై కలిగిన ఒత్తిడి మాత్రమే. ఇంతవరకు నాడుల ద్వారా ఇంద్రియ బహిర్ముఖ విషయాల మీదకు వెళ్ళిన మనస్సు ఇప్పుడు ప్రత్యాహారాన్ని కోరుతోంది. ఆ ప్రత్యాహారం సహజంగా నొప్పి కలిగిస్తుంది. ఆత్మ నిష్ఠయందు శ్రద్ధ కలిగి ధ్యానం చేయుట వలన ఆ నొప్పి తగ్గును. నిరంతరం ఆ యోగం చేయడం తప్ప మరో గొప్ప నివారణ మార్గం లేదు.

23. అజ్ఞానం నశించాలి. నేను చెప్పింది సరైనదేనా?

- 'ఎవరికి అజ్ఞానం నాశనం కావాలి'? అనే విషయాన్ని అన్వేషించిన చాలును.

## మనో నిగ్రహం

24. ఏ పద్ధతిని - ఏ మార్గాన సాధన చేసినా మనసును వశం చేసుకోవాలని చూస్తారు. దాన్ని నిగ్రహించమని చెపుతారు. ఒకవైపున - మనసు ఒక తెలియని వ్యక్తిగా - మరొక వైపున తనకు అనేకమైన వ్యవహారికి బాధలు, గొడవలు వుండగా - మనం నిజంగా మనోనిగ్రహం సాధించగలమా?

- సముద్రం ఎప్పుడూ చూడని ఒకాయన - దాన్ని చూసి తెలుసుకోవడానికి దాని దగ్గరకు వెళ్ళాడు. ఆ విశాల జలరాశి ముందు నిలిచి అందు స్నానం చేయాలనుకున్నాడు. ఆ తీరాన నిలిచి - చలించి, ఘోషిస్తున్నట్టి ఆ తరంగాల్ని చూసి "ఈ అలలన్నీ అణగిన తర్వాత స్నానం చేయాలనుకున్నాడు. అలలన్నీ అణగినప్పుడు - ఇంటి వెనుక చెరువులో స్నానం చేసినట్లు - సముద్రంలో దిగి స్నానం చేస్తాను" అనుకున్నాడు.

సముద్రం నిరంతరం అలసట లేకుండా తరంగాలతో సృష్టి మొదటినుంచి ప్రళయంవరకు ఆ విధంగా చలిస్తూ వుంటుందనే సంగతి ఇతరులు చెప్పడం వల్లగాని, లేదా - తనకు తానుగా తెలుసుకోవడం వల్లగాని - విషయం గ్రహించవలసి వుంది. అతడా సంగతి తెలుసుకున్న తరువాత సముద్రంలో దిగి స్నానం చేస్తాడు. అతడు చేతులు మెల్ల మెల్లగా వూపుతూ, గత సూచనల ద్వారా ఆ తరంగాలలో మునుగుతూ - తన తలపైనుంచి తరంగాల్ని పోనిస్తాడు. అతడు శ్వాసను సహజంగా బంధిస్తాడు. అట్లా చేయడం వలన అతడు నేర్పరి అవుతాడు. చివరికి తన లక్ష్యాన్ని సాధిస్తాడు. ఎటువంటి దుఃఖం - బాధ - కష్టం కలగకుండా.

సముద్రం చలిస్తూ వున్నా అతడు దాని బంధం నుండి విముక్తుడు అవుతాడు అని భగవాన్ చెప్పి - ఓ క్షణం తర్వాత - మనస్సు విషయంలో కూడా అంతే, అన్నారు.

25. విచారణ మార్గం ద్వారా నేను అహం మూలాన్ని వెదకుతూ వెళ్ళిన కొలది - ఒక్కొక్కప్పుడు మనోవైఫల్యాన్ని పొందుతున్నాను. ఆ అనుభవం చాలా సుఖంగా, సంతోషంగా, ఆనందంగా వుంది. నాకు ఎటువంటి తలంపులు కలుగుటలేదు. అక్కడ వున్నది శూన్యం - ఖాళీ మాత్రమే. ఆ అభ్యాసాన్ని కొనసాగించమంటారా?

- ఆ స్థితిని, ఆ అవస్థను మనోలయమని, లేదా ఆలోచన యొక్క తాత్కాలిక ఉపశమనమని అంటారు. ఆ అవస్థ పోగానే మళ్ళా పాత, కొత్త ఆలోచనలు మామూలుగా మనసులో ముసురుకుంటాయి. అది ఎప్పటికీ అంతం కాదు. సాధకుడు - అభ్యాసం అయిన వాడు ఎల్ల వేళలా మెలకువతో - ఎరుకతో "ఎవరికి ఈ అనుభవాలు కలుగుతున్నాయి? ఎవరకి సుఖం కలుగుతోంది?" అని విచారణ చేయవలసివుంది. అలా విచారణ చేయునప్పుడు అతడు దీర్ఘ పారవశ్యంలో, మైమరపులో పడిపోతాడు.

26. ఆలోచనలు ఆగి - అణగిన తర్వాత అప్పుడప్పుడు మధ్య మధ్య - కొన్ని శబ్దాలు నాకు వినిపిస్తున్నాయి. అవి - ఈలల లాగ, లేదా గిర గిరా తిరుగుతున్న మిల్లు మాదిరిగా శబ్దం చేస్తూ వినిపిస్తూ వుంటాయి.

ఆ శబ్దం అనేది ఎవరు? అని ప్రశ్నించు. ఆ ప్రశ్న అప్పుడప్పుడు వేసుకుంటూ వుండు.

27. మనోనిగ్రహం చేయుట నేను నేర్చుకోలేదు. కనుక - భగవాన్ అనుగ్రహం పొంది - నేను ఉత్తరభారత దేశం వెళ్ళి - ఏకాంత జీవితం గడపాలను కుంటున్నాను.

- ఏకాంతం కొరకు నువ్వు చాలా దూరంనుండి తిరువణ్ణామలై వచ్చావు. భగవాన్ రమణ మహర్షి సన్నిధిలో వుండి కూడా నువ్వు మనశ్శాంతిగా లేవు. నీకు లక్ష్యం కుదిరినట్టు లేదు. ఇప్పుడు నువ్వు ఇక్కడనుంచి ఎక్కడికో వెళ్ళాలని కోరుకుంటున్నావు. తర్వాత అక్కడనుంచి ఇంకో చోటుకు వెడతావు. ఆ విధంగా చూస్తే నీయాత్రలకు అంతం వుండదు. అదంతా నీ మనసు చేస్తున్న మోసమని, గమ్మత్తని నువ్వు తెలుసుకోలేకుండా వున్నావు. మొదట ఆ మనసును నిగ్రహించు. ఆ తర్వాత నువ్వు ఎక్కడ వున్నా సుఖంగా వుంటావు.

అట్టడుగుకు వెళ్ళడానికి ప్రయత్నించాలి. ఎక్కడనుంచి ఆలోచన పుడుతుందో - అక్కడకు చేరి, ఆలోచనలను - కోర్కెలను మనసును పెకళించి నిర్మూలించాలి.

28. నేను కొండ అవతలకు వెళ్ళి ఓ గంటో, రెండుగంటలో కూర్చుంటే, ఇక్కడ కూర్చున్నప్పటికంటే - ఎక్కువ శాంతిని అక్కడ అనుభవిస్తున్నాను. దాన్ని బట్టిచూస్తే - మనోనిగ్రహానికి ఏకాంత ప్రదేశం చాలా అవసరమని తోస్తుంది.

- నిజమే. కాని నువ్వు ఆ కొండవెనక ఇంకో గంట ఎక్కువ సేపు

కూర్చుంటే - ఇప్పుడు నువ్వు చెప్పే శాంతి - అప్పుడు అక్కడ నీకు దొరకదేమో! మనసును నిగ్రహించావా, అప్పుడు నరకం కూడా స్వర్గంగా తోస్తుంది.

29. ఏకాంతం, సర్వ సంగ పరిత్యాగం అవసరం కానప్పుడు - భగవాన్ తన పదిహేడవ ఏట అన్నీ వదిలి అరుణాచలం రావలసిన అవసర మేముంది?

- తన దేహాన్ని చూపిస్తూ - ఏ శక్తి అయితే దీన్ని ఇక్కడకు తీసుకువచ్చిందో ఆ శక్తే నిన్ను కూడా సంసారబంధం నుండి బైటకి తీసుకు వెడుతుంది. కాని, నీ ప్రయత్నంవల్ల నీ గృహమును త్యజించుట వలన ప్రయోజనం వుండదు. నీ ధర్మం - అభ్యాసం చేయుట - నిరంతరం ఆత్మవిచారణ కొనసాగించుట.

భగవాన్ ఎందుకు స్కందాశ్రమం వదిలేశారు?

ఏ శక్తి నన్ను మధురనుండి తిరువణ్ణామలైకి తీసుకు వచ్చిందో ఆ శక్తే నన్ను స్కందాశ్రమమునుంచి ఇక్కడకు తీసుకువచ్చింది. నాకు ఎటువంటి సంకల్పములు లేవు.

## సమాధి - తురీయావస్థ

30. సమాధి అనగా నేమి?

- అజ్ఞానంలో వున్న మనస్సు ఆత్మతో చేరినప్పుడు - ఆ అవస్థను

'నిద్ర' అంటారు. అదే ఎరుకతో - జాగ్రదావస్థలో - లోపల జరిగినప్పుడు - దాన్ని 'సమాధి' అంటారు. జాగ్రదావస్థలో మెలుకువతో, తెలివితో - ఆత్మలో నిలకడ కలిగి వుండుటే - సమాధి, నిద్రలో కూడా మనస్సు ఆత్మలో నిలుస్తుంది. కాని ఎరుకలేక వుంటుంది. సహజ సమాధిలో మాత్రం ఆ కలయిక నిరంతరం ఎడతెగకుండా వుంటుంది.

**31. కేవల నిర్వికల్ప సమాధి - సహజ నిర్వికల్ప సమాధి అనగా నేమి?**

- మనస్సు ఆత్మలో విలీనమై - నాశనం లేకుండా ఉన్న స్థితిని కేవల నిర్వికల్ప సమాధి అంటారు. ఆ మార్గంలో నాలుగు అడ్డంకులున్నాయి. 1) మనసు ఊగుట, 2) ప్రాణ కదలిక, 3) దేహం, 4) దృష్టి.

కేవల నిర్వికల్ప సమాధిలో వాసనాక్షయం జరగదు. అందువల్ల కైవల్య ప్రాప్తి కలగదు. సంస్కారాలు నశించిన తర్వాత ముక్తి లభిస్తుంది.

**32. అయితే, మీరు చెపుతున్నట్టి సమాధిస్థితి ఏమిటి?**

- యోగంలో చెప్పబడినట్టి సమాధి - ఒక రకమైన మైమరపు - పారవశ్యం. అది అనేక రకాలు. నేను చెప్పిన సమాధి వేరు. అది సహజ సమాధి. అక్కడ నీకు సమాధానం దొరకుతుంది. నువ్వు క్రియాత్మకంగా వున్నపుడు కూడా - నువ్వు ప్రశాంతంగా వుండి అన్నీ తెలుసుకుంటావు. నీలోని అగాధమైన సత్యాత్మ నిన్ను కదిలిస్తుందని

గ్రహిస్తావు. నీకు ఎటువంటి దుఃఖాలు, ఆరాటాలు, గొడవలు, జాగ్రత్తలు, సమస్యలు, బాధలు వుండవు. అక్కడ నీకు సంబంధించినది ఏదీ చివరకు అహంకారం కూడా లేదని గ్రహిస్తావు. నీకు ఏ శక్తితో ఎరుకతో ఏకీభవించి వున్నావో - అదే కర్మలన్నీ చేసి ఆచరిస్తుందని గ్రహిస్తావు.

ప్రశ్న - సాధకుడు ఎప్పుడు సహజ సమాధిని అభ్యసించగలడు?

- మొట్టమొదటినుండి అనేక సంవత్సరాలు నిర్వికల్ప సమాధి స్థితిని అభ్యసించినప్పటికి అతడు సంస్కారాల్ని వాసనలను నిర్మూలం చేయని యెడల అతడు కైవల్యం పొందలేడు.

**33. ఆ సహజ సమాధే, తప్పక కోర తగిన స్థితి అయితే నిర్వికల్ప సమాధి అవసరం లేదా?**

- రాజయోగంలో చెప్పబడిన నిర్వికల్ప సమాధి ఉపయోగమే. కాని, జ్ఞానమార్గంలో సహజనిష్ఠ - సహజ స్థితి కలిగినప్పుడు - అదే నిర్వికల్ప సమాధి. ఆ స్థితిలో - ఆ అవస్థలో మనస్సుకు సంశయాలు వుండవు. దానికి సత్యం అవగాహన అవుతుంది. అది, సత్య సన్నిధిని అనుభవిస్తుంది. కర్మ చేస్తున్నపుడు కూడా - అది - ఆ పరమసత్య సన్నిదిలోనే కదులు తున్నట్లు తెలుసుకుంటుంది.

**34. సమాధిలో జయింప బడినట్టి కర్మలు - సమాధి అనంతరం కర్మల్ని జయించడం ఎలా సాధ్యం?**

- సర్వత్రా పరిపూర్ణం అయినట్టి అనంత ఆత్మనుండి కర్మలు జరుగుతాయి. అవి - ఇంద్రియాల, అవయవాల ద్వారా జరుగుతాయి. మనిషి అహంకారం ఏమీ చేయుటలేదు. అది - స్వతంత్రంగా ఏం చేయడానికి అచేతనం కనుక ఏమీ చేయలేదు. (కలం పట్టుకుని రచయిత రచన చేస్తున్నప్పుడు అతడు తన భావాల్లో తన్మయుడై తాను రచిస్తున్నాననే సంగతి మరచిపోతాడు. దేహస్ఫురణ అతనికి వుండదు. ఎప్పుడైతే తాను కలం పట్టుకొని - కాగితం మీద రాస్తున్నాననే భావన కలిగిందో - అతని భావనాశక్తి ప్రభావం దానికి అడ్డుపడుతుంది. దానితో అతడు బహిర్ముఖుడై రాయలేక పోతున్నాడు. చెయ్యి - కలం రెండూ జడపదార్థాలే. ఆత్మశక్తి వాటికి చైతన్యాన్ని ఇచ్చి - కర్మ చేయుటకు శక్తివంతం చేస్తుంది.)

కర్మఫలం ఆత్మను ఎప్పుడూ అంటదు. ఆకాశంలో మేఘాల ఘర్షణ వల్ల కలిగిన ఉరుములు - మెరుపులు - శబ్దం అకాశాన్ని అంటవు కదా? మనం ఆత్మశక్తినుండి విడిగా లేమని - మనం అందులో అంతర్లీనంగావున్న ఒక భాగమని తెలిసినప్పుడు మనం తికమక పడడానికి కారణమే కనిపించదు.

**35. స్థితప్రజ్ఞుడైనవాడు తాను స్థితప్రజ్ఞుడని ఎలా తెలుసుకోగలుగుతాడు? తన యొక్క పూర్వచిత్‌జ్ఞానం వలన కలుగుతుందా? లేక భౌతిక విజ్ఞానం ఆగిపోవడం వల్ల కలుగుతుందా?**

- వాసనా విముక్తమైన మనస్సు మౌనం ద్వారా సహజావస్థలో

నిలకడ కలిగినప్పుడు, జ్ఞాత తనను తాను తెలుసుకుంటాడు, ఎటువంటి సంశయం లేకుండా!

## ఆత్మసాక్షాత్కారం

36. సత్యాన్వేషికి జ్ఞానలబ్ధికొరకు గ్రంథపఠనం ఒక్కటే సరిపోతుందా?

- సత్యాన్వేషికి కేవలం శాస్త్రపఠనం ముక్తిని కలిగించలేదు. ఆధ్యాత్మిక అభ్యాసం, లేక ఉపాసన చేయక ఆత్మను పొందలేరు. ఇది నిశ్చయం - సత్యం. ఆధ్యాత్మిక అభ్యాసంలో కలిగే సహజావస్థే ఉపాసన. అది - అచంచలంగా వున్నప్పుడు దాన్ని జ్ఞానం అంటారు.

37. ఇరవై ఐదు సంవత్సరాలనుండి నేను సాధన చేస్తున్నాను. నేను ఎప్పుడూ ఎక్కువగా కృష్ణనామాన్ని ఉచ్చరిస్తూ వుంటాను. ఇప్పటి వరకు రోజుకు యాభైవేలు నామాలు చేస్తున్నాను. ఇప్పుడు నా మనస్సు దైవ చింతనలో నిలకడగా వుండడానికి నిరాకరిస్తోంది. నాకు ఏం జరిగింది? నేను ఏం చేయాలి?

- నువ్వు మద్రాసుకు ఎలా వచ్చావు?

- రైలులో.

తిరువణ్ణామలై రైల్వే స్టేషనుకు వచ్చినపుడు ఏం జరిగింది?

- రైలు దిగాను. టి.టి.కి. టిక్కెట్లు ఇచ్చి ఎద్దు బండిలో ఆశ్రమానికి వచ్చాను.

ఆశ్రమం చేరి, బండి అతనికి డబ్బు ఇచ్చిన తర్వాత ఆ బండి ఏమైంది?

- తిరిగి వెనక్కి వెళ్ళిపోయివుంటుంది.

రైలు నిన్ను లక్ష్యానికి చేర్చింది. నీవు రైలునుంచి బైటకివచ్చావు. ఇంక నీకు దాని అవసరం లేకపోయింది. నువ్వు ఎక్కడికి చేరాలో నిన్ను అక్కడికి అది తీసుకొచ్చింది. అదే విధంగానే తిరువణ్ణామలై చేరగానే, ఎద్దుబండి నిన్ను ఆశ్రమానికి చేర్చింది. ఇంక ఇప్పుడు నీకు ఎద్దుబండి గాని, రైలుగాని ఏమాత్రం అవసరం లేకపోయాయి. నిన్ను ఇక్కడకు తీసుకువచ్చుటకు అవి సాధనాలయ్యాయి. ఇప్పుడు నువ్వు ఇక్కడ వున్నావు. వాటితో ఇప్పుడు నీకు పని లేదు.

నీ సాధనకు, నీ జపానికీ అదే జరిగింది. నీ స్వాధ్యాయం - నీ ధ్యానం నిన్ను నీ ఆధ్యాత్మిక లక్ష్యానికి చేర్చాయి. ఇంక నీకు వాటితో పనిలేదు. నీ అంతట నువ్వు అభ్యాసాన్ని వదిలేసి మానేయలేదు. వాటంతట అవే నిన్ను వదిలేసాయి. ఎందుకంటే, వాటి పనులు అవి నెరవేర్చాయి. నీవు చేరవలసిన చోటుకు నువ్వు చేరావు.

**38. తన్ను తాను పరిశీలించి - తెలుసుకోవడం ఎలాగ?**

- నిన్ను నీవు పరిశీలించి తెలుసుకోవడంలో 'రెండు నేను'లు. ఒకటి - తెలుసుకునేది, రెండవది - తెలియవలసింది - వున్నట్లు తెలియవస్తోంది. ఆత్మగా వుండటమే, ఆత్మను తెలుసుకోవడం. నువ్వు

వేదాల్ని - శాస్త్రాల్ని అధ్యయనం చేసిన యెడల ఈ లోకంలో నీకు మంచి పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. సంఘం నీ కంఠాన్ని పూలహారాలతో నింపుతుంది. నిన్ను స్తుతించి, మంచి విందులిస్తుంది. మంచి పేరు, ధనం లభిస్తాయి. ఇవన్నీ కూడ జ్ఞానసాధనానికి గొప్ప ఆటంకాలూ, అవరోధాలూ అవుతాయి.

39. స్వామీ! నాకు ఏమీ అఖ్ఖర్లేదు. ఒక్క మోక్షం ప్రసాదిస్తే చాలు.

- (హృదయపూర్వకంగా నవ్వుతూ) అమ్మ్మటకు మోక్షమనేది ఒక వస్తువా? నేను దాన్ని ఎక్కడైనా దాచి పెట్టానా? అన్నీ విడిచి పెట్టుటే మోక్షం - నా దగ్గర ఏదైనా విడిగా వుందా - నేను నీకు ఇవ్వడానికి?

40. భగవాన్, నేను ఎన్నో ఏళ్ళనుంచి ఇక్కడికి వస్తున్నాను. అయినా నాలో ఎటువంటి పురోభివృద్ధి - ప్రగతి కనిపించలేదు. నేను పూర్వం మాదిరిగానే పాపిగా మిగిలిపోయాను.

- ఈ మార్గంలో మైలు రాళ్ళు లేవు. నువ్వు ఎంత దూరం ప్రయాణం చేశావో నీకేం తెలుసు? మొదటి తరగతి రైల్వే ప్రయాణికుని మాదిరిగా నువ్వు ఎందుకు అనుసరించలేక పోయావు? అతడు తన గమ్యం గార్డుకు చెప్పి - తలుపులు మూసి - సుఖంగా నిద్రపోతాడు. అతడు చేయవలసింది అంతే! అతడు దిగవలసిన స్టేషన్ రాగానే, గార్డు వచ్చి అతన్ని లేపుతాడు.

41. భగవాన్, మూలంలో నిలకడ చెందాలనే నా ప్రయత్నాలన్నింటిలో నేను విఫలుడనయ్యాను.

- నీ అభ్యాసాన్ని కొనసాగించు. నీ యోగక్షేమాలు సదా చూస్తున్నట్టి భగవంతుడికి నువ్వేమీ జ్ఞాపకం చేయనవసరం లేదు. 'భగవంతుని అనుగ్రహం లేదు' అనే దురభిప్రాయంతో సాధకుడు తన ప్రయత్నం విరమించుట సహజం. కాని, సాధకుడు అట్లా చేయకూడదు. ప్రయత్నం కొనసాగించాలి. ఎందుకంటే, సకాలంలో భగవంతుని అనుగ్రహం తప్పక పనిచేస్తుంది.

**42. భగవాన్, దయచేసి నాకు ఆత్మసాక్షాత్కారం ప్రసాదిస్తారా?**

- 'ఎవరికి ఆత్మసాక్షాత్కారం?' అని విచారణ చేసిన యెడల అతడు తన వ్యక్తిత్వాన్ని కోల్పోతాడు. అప్పుడు 'ఆత్మ సాక్షాత్కారం కలగలేదు' అనే భ్రాంతి తొలగుతుంది. అదే గురువు అనుగ్రహం. 'ఆత్మ సాక్షాత్కారం కాలేదే' అనే అజ్ఞానాన్ని గురువు తొలగించగలడు కాని, ఆత్మ సాక్షాత్కారం కలగ జేయుట అసాధ్యం. ఆత్మసాక్షాత్కారం కలిగించమని ప్రార్థించడం ఎలా వుంటుందంటే, నన్ను నాకు ఇమ్మని అడిగినట్లు వుంటుంది. ఎందుకంటే, దేహతాదాత్మ్యం చెందుట వలన 'నేను ఒక వ్యక్తిని' అనే భ్రమ కలుగుతుంది. ఆ భ్రమ నుండి గురువు కూడా నావలె ఒక వ్యక్తే. నాకంటే భిన్నమైన వ్యక్తి' అనే మరో భ్రమను కలుగజేస్తుంది. గురువు ఆత్మకన్నా భిన్నం కాదు.

**43. ప్రతిరోజు క్షణకాలమైన సత్యాత్మానుభవ జ్ఞానం కలిగే అవకాశం వుందా?**

- నిద్రకి, జాగ్రదవస్థకీ మధ్య సంధ్యా సమయం క్షణకాలం

వుంటుంది. జాగ్రదవస్థ - 'నేను' అను ఆలోచనతో అదే అహం వృత్తితో ఆరంభమౌతుంది. ఆ అహం వృత్తి - 'నేను' అనే ఆలోచన - పెద్ద అలగా లేచే ముందు శుద్ధచైతన్య స్ఫురణ లిప్తమాత్ర కాలం వుంటుంది. మొదట అజ్ఞానం - తర్వాత శుద్ధచైతన్యపు వెలుగు - ఆ తర్వాత 'నేను' అను తలంపు ప్రపంచ స్ఫురణ కలుగుతుంది. అదే క్రమం. ఆ క్రమంలో మధ్య అవస్థే ఎరుక. అదే ఆత్మస్ఫురణ. ఆ అవస్థలో మనం తగినంత జాగ్రత్తగా వుంటే ఆ ఎరుకను గుర్తించగలం.

44. ఆత్మసాక్షాత్కారానికి కొన్ని ప్రయోగాత్మక - మార్గదర్శక సూచనలు నాకు ఇవ్వండి.

(బైబిల్ ఉదహరిస్తూ) - 'నిశ్చలంగా వుండు. 'నేను' దేవుడని తెలుసుకో' అని మళ్ళా వెంటనే 'దేవుడని తెలుసుకో కాని, నేను దవుడనని అనుకోకు' అన్నారు.

ఆత్మ, తాను ఎంచుకున్న వానికే దర్శనభాగ్యం కలగజేస్తుందని పురాణాల్లో వుంది. అదే నిజమైతే మన ప్రయత్నాల వల్ల లాభం ఏమిటి?

- ఎవరైతే అంతర్ముఖులౌతారో అట్టి వారిని మాత్రమే ఆత్మ తనలోకి లాక్కుంటుంది. ఎంత వరకైతే సాధకుడు బహిర్ముఖుడుగా వుంటాడో అంతవరకు అతనికి ఆత్మసాక్షాత్కారం అసాధ్యం. చాలా మంది ఆత్మను నిర్వచించడానికి యత్నిస్తారు గాని, ఆత్మను తెలుసుకోవడానికి ప్రయత్నించరు.

* ఆత్మసాక్షాత్కారం అంటే ఏమిటి?

- ఏదో జరగాలని అనుకుంటారు ప్రజలు. స్వర్గం నుండి ఏదో ఒకటి మెరుపులాగ క్రిందికి జారి పడాలని ఆశిస్తారు. ఆత్మసాక్షాత్కారం అటువంటిది కాదు. 'నేను, ఈ దేహాన్ని, నేను ఇది, నేను అది' అనే అభిప్రాయాన్ని వదిలినప్పుడే నీవు నీవుగా వుంటావు.

**45.** నాకు ఆత్మానుభవం కలిగిందని అనుకుంటున్నాను. కాని, నా మనస్సు దాన్ని ఒప్పుకోవడం లేదు.

- ఒకదాన్ని ఒకటి వ్యతిరేకించే ఆ రెండు 'నేను'లు ఏమిటి? ఆత్మ ఒక్కటే 'అనేది సర్వానుభవం'.

ప్రశ్న - ఆత్మయొక్కస్వభావం ఏమిటి?

- ఆలోచనలనుండి విడిపడి ఆత్మనిష్ఠుడివి కమ్ము. ఆత్మ స్వభావం గు ంచి విచారించడానికి బదులు.

**46.** ఆత్మసాక్షాత్కారం పొందుట చాలా దుర్లభమని నేననుకుంటున్నాను.

- నీ సాధనలో అపజయాన్ని ముందుగా నీకు నువ్వే తెలివి తక్కువగా వూహించడం దేనికి? ముందుకు సాగు. నువ్వు అక్కడే, ఆత్మలోనే వుంటావు.

47. శరణాగతి చెందిన తర్వాత, నేను నా పనులు చేసుకోవడం సాధ్యమా?

- తప్పకుండా సాధ్యమే. కాని "నేను చేస్తున్నాను" అనే అభిప్రాయం కలగకూడదు.

'నేను' అనే ఆలోచన లేనిది. అహంవృత్తి లేనిది, నా పనులు ఎలా సాగుతాయి?

- నువ్వు ఏ పనికైతే జీతం తెచ్చుకుంటున్నావో, ఆ పనిని వైరాగ్య భావంతో చెయ్యి. అలాగే నీ కుటుంబ వ్యవహారాలు కూడా వైరాగ్య భావంతో చెయ్యి. నీ ఆఫీసు వ్యవహారాలు ఎటువంటి ఉదాసీనతతో చేస్తావో అంటే, నీ ఆఫీసులో జరిగె మంచి చెడ్డలు, వచ్చి పోయె విషయాలు నిన్ను బాధించడం లేదు కదా? అదే విధంగా నీ నిత్యజీవిత కలాపాలు అటువంటి అనాసక్తతతోనే చేస్తూవుండు.

కష్టాలు నాకు వస్తూనే వున్నాయి. అవి ఎప్పుడు ఆగిపోతాయి.

- 'నేను, దేహాన్ని' అనే భావాన్ని వదిలేసినప్పుడు నీ కష్టాలన్నీ ఎగిరిపోతాయి.

48. జాగ్రత్ స్వప్నావస్థలో వ్యత్యాసం లేనప్పుడు ఆత్మను స్వప్నావస్థలో ఎవరైనా తెలుసుకోగలరా?

- ఆత్మను మొదట జాగ్రదావస్థలో తెలుసుకో. ఆ తర్వాత ఈ ప్రశ్నవేసుకో.

**49. సహజావస్థలో వుంటూ చురుకుగా పనులు చేయగలరా?**

- అజ్ఞాని అయినట్టివాడు - సహజావస్థలో వున్నవారు కూడా కర్మకలాపాలలో మునిగి - అందు చిక్కుకుని వుంటారని అనుకుంటాడు. ఏమైనా అతడు ఎటువంటి కర్మా చేయడం లేదు. చూచువాని దృష్టినుండి మాత్రమే అతను కర్మల్లో నిమగ్నుడైవున్నవాడు. చూచువాడు కూడా సహజావస్థలో వున్నయెడల, అటువంటి అనవసర ప్రశ్నలు ఉదయించవు. సహజావస్థను అనుభవించని వారికి అటువంటి సంశయములు కలుగును. ఆ స్థితి కావలసినవారు నిశ్చలంగా వుండవలె. ఊరికే వుండవలె. ఇది వినికిడి జ్ఞానం మాత్రం కాదు.

**50. సాధకుడు తన దృష్టిని భ్రూమధ్యలో నిలపమని శాస్త్రాలు చెపుతున్నాయి. అది సరైన పద్ధతా?**

- 'నేను' అనే భావం ప్రతిదానికి సాక్షాత్తు అనుభవమే. ఆ భావాన్ని విడిచిపెట్టి, ఫలానా దేవుణ్ణి చూచుట వలన ఏం జరుగుతుంది? 'భగవంతుడు ఫలాన ప్రదేశంలో - భూమధ్యలో వుంటాడు' అని తలచడం కంటే, తెలివి తక్కువతనం మరొకటి లేదు. అటూ - ఇటూ తిరిగే మనస్సును కేంద్రీకరించుటకు అటువంటి హింసాత్మకమైన సాధనను చేయుట సరైన పద్ధతి కాదు. 'నేను ఎవడను?' అని విచారణ చేయుట మనోనిగ్రహానికి సులభమైన మార్గం.

**51. ఆత్మవిద్య అత్యంత సులభమని మీరు అన్నారు. ఏ విధంగా ఆత్మవిద్య సులభమౌతుంది?**

- దానికి ఉదాహరణగా, ఉపమానంగా, కరతలామలకం చేపుతారు. ఆ కరతలామలకంకంటే కూడా ఆత్మను సులభంగా, సూటిగా దర్శించవచ్చు. ఎందుకంటే ఆ కాయను చూడ్డానికి కళ్ళు - దాన్ని వుంచ డానికి చెయ్యి వుండాలి. మనసు కూడా మంచి స్థితిలో వుండాలి. ఆ నాలుగింటిలో ఏ ఒక్కటి లేకపోయినా, ఆ స్వల్ప జ్ఞానం కలగడం కష్టమే. కాని 'నేను' అనేది స్వయంగా ప్రకాశిస్తుంది. కనుక ఆత్మవిద్య చాలా సులభమైనది. ఆత్మను పొందడానికి ప్రయత్నిస్తున్న వానిని తెలుసుకోవడం మరీ సులభం.

**52. ఆత్మను ఎందుకు సూటిగా దర్శించలేకపోతున్నాం?**

- ఆత్మ ఒక్కటే ప్రత్యక్షానుభవం. ఇతరం ఏదీ కూడా ప్రత్యక్షానుభవం కాదు. అది మన అందరికీ ప్రత్యక్ష అనుభవం అయినప్పటికీ అది 'నేను దేహాన్ని' అను భావంతో కప్పబడివుంది. ఆ తలంపును మనం విడిచి పెట్టగలిగితే ఆత్మ ప్రతి ఒక్కరికి ప్రత్యక్షానుభవమై స్వయంగా ప్రకాశిస్తుంది.

ప్రశ్న - భగవాన్ దాన్ని చాలా సులభంగా వివరించారు. కాని 'నేను దేహాన్ని' అనే భావం మమ్మల్ని వదలడం లేదు.

- దేహోహం - అది చాలా బలవంతమైనది కనుక అది నిన్ను వదలడం లేదు.

ప్రశ్న - ఎందుకు - ఎలాగా ఆ తలంపు కలిగింది?

- మీ పరమైన విచారణ లేకపోవుటవల్లనే ఆ భావం కలిగింది. కైవల్య నవనీతం (2-95)లో విషయంలో ఇటువంటి వివరణే ఇవ్వబడింది. మాయ యొక్క స్వరూపాన్ని నిర్ణయించలేరు కాబట్టి - అది అనిర్వచనీయమన్నారు. ఇది నాది. 'నేను దేహాన్ని' అని అనుకున్నవారు - ఆ మాయ వలలో చిక్కివుంటారు - ఈ జగత్తు నిజమనుకుంటారు. ఓ కుమారా, ఈ అద్భుతమైనట్టి మాయామోహం ఎలాగ కలిగిందో ఎవరూ నిర్ణయించి చెప్పలేరు. వివేక - విచారణ బలం లేకపోవడం వల్ల అది మనలో ఉదయించినది.

53. ఆత్మలో ఐక్యమైనప్పుడు విలీనమైనప్పుడు మనం మన వ్యక్తిత్వాన్ని కోల్పోతామా?

- ఆత్మలో వ్యక్తిత్వం లేనే లేదు. ఆత్మ ఏకం-పరం.

ప్రశ్న - అయితే వ్యక్తిత్వం - ఐక్యం లేదన్న మాట?

- గాఢ నిద్రలో నీవు - నీ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటున్నావా?

ప్రశ్న - కాని, మనం వాటిని జన్మ-జన్మలకు నిలబెట్టుకుంటున్నాం కదా?

- అవునవును, 'నేను' అనే ఆలోచన - అహం వృత్తి మరల - మరల ఉదయిస్తూ వుంటుంది. నువ్వు అహాన్ని ప్రతిజన్మలోనూ తన దేహంతో - వివిధ పరిసరాలతో, ప్రదేశంతో ఏకమై తాదాత్మ్యం చెందుతున్నావు. పూర్వజన్మ కృప కర్మఫలం, ఈ జన్మలో నూతన

దేహాన్ని వశం చేసుకుని గతంలో మాదిరి కర్మఫలితాన్ని అనుభవిస్తుంది. కర్మే దేహాన్ని కల్పించింది. ఫలానా ప్రదేశంలో ఫలానా కుటుంబంలో - తెగలో - వాతావరణంలో లింగాంగభేదములతో వుంచింది ఆ కర్మఫలమే.

ఈ ప్రశ్నలు మంచివే కాని, వీటిని ఎక్కువ బుద్ధి బలంతో ఆలోచించకూడదు. ఆలోచన లేకుండా ధ్యానం చేయడం మంచిది. మనస్సును ఆత్మయందు విశ్రాంతి తీసుకోనియ్యి, అప్పుడు అది సహజమైపోతుంది. అప్పుడు ప్రశ్నలు వేయవలసి అవసరం వుండదు. దాని అర్థం - మొద్దు బారి వుండటం కాదు. మౌనమే నిజమైనట్టి క్రియ.

**54.** ప్రస్తుత అనుభవాలు - గత కర్మ ఫలితమంటారు. అప్పుడు మనం చేసినట్టి తప్పులు - ఇప్పుడు తెలుసుకుంటే మనం సరిదిద్దుకొందుము.

- ఒక తప్పును సరిదిద్దుకుంటే - అనేక జన్మలు కలిగించే సంచిత కర్మ అంతా ఇంతా మిగిలే వుంటుంది. కనుక అది సరైన పద్ధతికాదు. ఎండు కొమ్మల్ని విరిచి - తక్కిన మొక్కను రక్షించి పెంచిన కొలది - అది మరీ గట్టిగా బలంగా ఎదుగుతుంది. కర్మను ఎంత సరిదిద్దు-కుందామను కుంటాడో అది - మరింత కర్మను పెంచుకుంటుంది. కర్మమూలం వెదకి దాన్ని భేదించు.

Q: ఈ కర్మబంధం నుండి విముక్తి చెందుట ఎట్లు?

- 'ఎవరికి కర్మ?' అని విచారణ చెయ్యి. నీవు కర్తవు కాదని తెలుసు కుంటావు. అప్పుడు నీవు ముక్తుడవు అగుదువు. దానికి ఈశ్వరానుగ్రహం అవసరం. కనుక దాని కొరకు ఆయన్ని ప్రార్థించి, పూజించి, ధ్యానించు.

## గురువు

**55. భగవాన్, నాకు ముక్తి పొందాలని వుంది. దానికి మీరు నాకు గురువుగా వుండాలి. నేను ఇతరులనెవరిని గురువుగా అన్వేషించను. ఆశ్రయించను. దయచేసి నాపై మీ అనుగ్రహం వుంచండి.**

- ముక్తి పొందటమనేది కొత్తగా సాధించేదేమీ కాదు. మనమందరం ముక్త స్వరూపులమే - మనం ముక్తాత్ములమే. ఆ సత్యాన్ని మరచి నేను - ఈ దేహం' అని అనుకుంటాం. తద్వారా వేలాది ఆలోచనలు సముద్ర తరంగాల వలె ఒక దాని తర్వాత ఒకటి కలిగి, అసలు మనం ఎవరమై వున్నామో - దాన్ని మరుగు పరుస్తాయి. 'దేహోహం' అనే తలంపు నశించినప్పుడు - ముక్తి దానికదే ప్రకాశిస్తుంది.

**56. నేను నివసించే గ్రామంలో గురువులెవరూ లేరు. నన్నేం చేయమంటారు?**

- గురువు నీలోనే వున్నారు. ఆయనకు అక్కడ శరణుజొచ్చు.

నాలో వున్నది నా ఆత్మే కదా?

- గురువు - ఆత్మ, ఈశ్వరుడు అవన్నీ ఒకేదానికి, పర్యాయ పదాలు. వాటి అన్నిటి సారం ఒకటే.

57. ఆత్మ విచారణ మార్గంలో ప్రగతి చెందుటకు గురువు అనుగ్రహం అవసరం కాదా?

- తప్పక అవసరం. కాని నువ్వు విచారణ చేయడము కూడా గురువు అనుగ్రహమే. విచారణ చేస్తూవుండు.

ముందుకు ఎలా వెళ్ళాలో తెలియడంలేదు.

- ఎవరికి తెలియదు? నువ్వు "నేను" అంటున్నావు. మళ్ళా అప్పుడే 'నాకు తెలియదు' అంటున్నావు. అదంతా హాస్యాస్పదంగా లేదా? నువ్వు నిరంతం సాధనచేస్తూ, మిథ్యా - అహం భావాన్ని వదలాలి. అది చెయ్యి.

గురు సహాయం ఉపయోగం కాదా?

- అవును. ప్రారంభదశలో ఉపయోగమే! కాని, విచారణ మార్గంలో నీకు నువ్వే ముందుకు సాగాలి.

Q: ఎంత వరకు ఆ విచారణ కొనసాగించాలి?

- నీ ఆఖరి మిథ్యాభావం పతనమై -పడిపోయే వరకు. అంటే ఆత్మసాక్షాత్కారం అయ్యేవరకు.

58. గురువు అవసరం లేదని మీరు చెప్పినట్లు - కొందరు చెపుతారు.

మరి కొందరు దానికి వ్యతిరేకంగా చెపుతారు. మహర్షి ఏమంటారు?

భగవాన్ - గురువు అవసరం లేదని నేను ఎప్పుడూ చెప్పలేదు. గురువంటే మీరు ఏమని అర్థం చేసుకుంటున్నారో, దానిపై గురువు అవసరం - అనవసరం అనేది ఆధారపడి వుంటుంది. గురువు - మానవదేహంలో వుండనవసరం లేదు. దత్తాత్రేయునికి ఇరవైనలుగురు - పంచభూతాలు మొదలైనవి, అంటే ప్రపంచంలో ప్రతివస్తువు - ప్రతిపదార్థం ఆయనకు గురువుగా తోచాయి. గురువు చాలా అవసరం. ఉపనిషత్తులు చెప్పేది ఇదే! సద్గురువు తప్ప - మానవుణ్ణి 'దేహేంద్రియబుద్ధి' అనే కీకారణ్యం నుండి బైటికి తీసుకువెళ్ళలేదు. కనుక గురువు వుండి తీరవలసిందే.

నేను చెప్పేది, ఒక మానవ దేహంలో వున్న గురువు సంగతి. మహర్షికి అటువంటి గురువు లేరు కదా?

- నాకూ అటువంటి గురువు వుండే వుంటారు. ఏదో ఒక సమయంలో, నేను అరుణాచలేశ్వరునికి స్తుతి గీతాలు పాడలేదా? గురువంటే ఏమిటి? గురువంటే ఈశ్వరుడు లేక ఆత్మ. తన కోర్కెలు ఈడేర్చమని మనిషి మొదట ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. సమయం వచ్చినపుడు భౌతిక కోర్కె ఈడేర్చమని ఈశ్వరున్ని ప్రార్థింపడు. అప్పుడు భగవంతుని కొరకే ప్రార్థిస్తాడు. అప్పుడు భగవంతుడు మానవ రూపంలో కాని, మరే రూపంలో కాని దర్శనమిచ్చి - అతని ప్రార్థనానుసారంగా అతన్ని నడపడానికి దర్శనమిస్తాడు.

59. తనకు శిష్యులు లేరని భగవాన్ అంటారు.

- అనుమానాస్పదంగా చాడ్విక్ వంక చూస్తూ అవును, అన్నాను.

ప్రశ్న - కాని, మీరే అంటున్నారు, చాలామంది సాధకులకు గురువు అవసరమని.

- అవును, అన్నాను.

ప్రశ్న - అయితే ఇప్పుడు నన్నేం చేయమంటారు? నేను చాలా దూరంనుంచి కొన్ని సంవత్సరాల క్రిందట వచ్చి - భగవాన్ పాదాల సన్నిధి కూర్చున్నాను. ఇదంతా వృథాకాలయాపనేనా?

- సత్యాన్వేషికి ఈశ్వరుడు కరుణతో ఒక మానవ రూపాన్ని ధరించి తన నిరాకారస్థితికి తీసుకువెడతాడు. ఈ విషయంలో ఆయనకు ఏమైనా సంశయం వుందా? నేను ఒక పత్రం వ్రాతమూలకంగా ఆయనకు రాసి ఇవ్వాలేమో అడగండి? వెళ్ళి - సబ్ రిజిస్ట్రార్ నారాయణ అయ్యర్‌ను పిలవండి. ఆయన్ని ఒక డాక్యుమెంట్ రాసి ఇవ్వమనండి.

## శాంతి

60. అన్ని మతాల లక్ష్యం - గమ్యం ఏమిటి?

- శరణాగతి ద్వారా శాంతి.

* 61. శాంతి అంటే ఏమిటి?

- మన స్వరూప - స్వభావమే శాంతి. మనకు మనం అశాంతిని వూహించుకుని శాంతిని కోరతాం. నిజం చెప్పాలంటే మనం ఎప్పుడూ

శాంతిలోనే వున్నాం. మనకు మనం పూర్ణస్వరూపంగా మిగిలి వుండటమే శాంతి. శాంతి కోసం ప్రయత్నించడం ఎలా వుంటుందంటే, పీకలోతు మంచి నీటిలో నిలబడి 'దాహం తీరలేదు' అని ఫిర్యాదు చేసినట్లు వుంటుంది. 'నీరే దాహాన్ని కలిగిస్తుందా?' అని ఆశ్చర్యపడతారు.

**62.** నేను మనశ్శాంతి పొందలేకపోతున్నాను. శాంతికొరకు హిమాలయాలకు వెళ్ళాలనుకుంటున్నాను.

- మీరు రెండువందల యాభై మైళ్ళు ప్రయాణం చేసి ఇక్కడకు వచ్చారు. ఇప్పుడు మీరు ఇక్కడ ఎంత మనశ్శాంతి పొందారు? ఇక్కడనుంచి హిమాలయాలకు ఎన్ని మైళ్ళో లెఖ్ఖవేసి ఎన్ని రేట్లు శాంతి పొందుతారో ఊహించండి.

ప్రాపంచిక ఒడిదుడుకుల్లో పడి మనస్సు ఎందుకు నలిగిపోతుంది?

- ఆ నలిగిపోయేది ఎవరు? నువ్వు బాధ పడుతున్నప్పుడెల్ల, ఆ ప్రశ్న మళ్ళా - మళ్ళా వేసుకుంటూ వుండు. నీవు దేహానివి కావు. కేవలం ఆత్మవు. అది - ఏదీ కలవని ఆనందస్వరూపం. మరి నిన్ను ఈ ప్రాపంచిక విషయాలు ఎలా బాధించగలవు?

**63.** నాకు ధనం వుంది. అధికారం వుంది. సుఖాన్నిచ్చే ప్రాపంచిక వస్తువులన్నీ వున్నాయి. కాని శాంతిలేదు.

- ఎందుకు శాంతిని కోరుతున్నావు? నువ్వు - నువ్వుగా ఎందుకుండ లేవు?

ఎందుకంటే నేను మరొక విధంగా సుఖంగా వుండలేకపోతున్నాను.

తలనొప్పితో బాధ పడేవాడు సరైన మందు తీసుకోకపోతే, ఎలాగ విశ్రాంతిగా వుండలేడో అలాగే శాంతి, ఆరోగ్యం, మన స్వభావం కాని అనారోగ్యం కాదు. అలాగే శాంతి మన స్వభావం - మన నిశ్చయంగా శాంతి స్వరూపులం. అది విస్మరించి బైట నుంచి శాంతిని కోరుతున్నాం. అది అసాధ్యమైన అన్వేషణ. అదే నీకు ఈ రకమైన కష్టాల్ని కలిగిస్తోంది. బాహ్య విషయాల వస్తువుల నుంచి నీ మనస్సు వైదొలగినప్పుడు అంటే నీవు అంతర్ముఖుడవు అయిన క్షణాన నీవు శాంతిని పొంది, సుఖంగా వుంటావు.

64. అప్పుడప్పుడు సుఖంగా వున్నా కొన్ని వేళల్లో సుఖంగా వుండలేక పోతున్నాను. నేను ఆశించి వూహించినట్లు అనుకూలంగా లేకపోవడం వల్ల, తత్కారణంగా సుఖం చాలా చంచలమైనది.

- నువ్వు ఎందుకు అశాంతిగా వుంటున్నావు? నువ్వు నీ మనస్సు - శరీరం మాత్రమే సుఖాన్ని ఆశిస్తున్నావా? అశాంతి ఎంతో కాలం వుండటం లేదని నువ్వే అంటున్నావు. శాశ్వత సుఖం కొరకు ఆత్మను అన్వేషించి తెలుసుకొనుటే దానికి మార్గం. సూర్యప్రకాశం లాగ నీ హృదయాకాశంలో సత్యం స్వయంగా ప్రకాశించును. అప్పుడు మనస్సు అశాంతిగా అసుఖంగా వుండదు. నిజమైన సుఖం ఉప్పొంగుతుంది. ఆత్మ సుఖం ఒకటే.

65. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు - నేను మనస్సును ఓదార్చలేక పోతున్నాను.

- పారమార్థిక సత్యం విషయంలో అజ్ఞానం వల్ల మనస్సుకు ప్రాపంచికసుఖం - దుఃఖం కలుగును. మానవుని స్వభావం, సుఖం. అది అంతర్గతమైన సుఖం. అటువంటి సుఖం కొరకు చేసే అన్వేషణే - ఆత్మసాక్షాత్కారం కోసం చేసే అన్వేషణ. చివరికి సదా వున్నట్టి ఆనందాన్నే కనుక్కుంటాడు. ఆ సుఖం, ఆనందం అంతులేనిది. అది శాశ్వతమైనది.

## జన్మ - పునర్జన్మ

**66. జన్మ - పునర్జన్మ గురించి నాకు బోధించగలరా?**

గతంలో ఎలా వుండేవాడివో - ముందు ఎలా వుంటావో తెలుసు కోవాలిని కుతూహలం పడుతున్నావు. అసలు నువ్వు ఎవరివో ఆ సంగతి తెలుసుకున్నావా? నిన్ను నీవు తెలుసుకోవడం ముఖ్యం. నువ్వు ఏమై వున్నావో కనుక్కో. అప్పుడు నువ్వు ఏం తెలుసుకోవాలో అది తెలుసు కుంటావు.

**67. మరణం అంటే ఏమిటి? జననం అంటే ఏమిటి?**

- శరీరానికే జననం - మరణం. దేహం మాయామయం. అది ఒక భ్రాంతి. నిజం చెప్పాలంటే జనన - మరణాలు లేవు. వాటికి నిజమైన వాస్తవత్వం ఏమీ లేదు.

మరణానికి - పునర్జన్మకూ మధ్య ఎంత విరామం వుంటుంది.

- ఒకటి తిరిగి పుట్టాలంటే, ఒక సంవత్సర కాలం పట్టవచ్చు. ఒక్కోసారి మూడేళ్ళు, లేదా వెయ్యేళ్ళూ కావచ్చు. ఎవరు చెప్పగలరు? ఏమైనా కాలమంటే ఏమిటి? కాలం లేనే లేదు.

మరణం అంటే ఏమిటి?

- తన నిజ స్వరూపాన్ని మరచుటే మరణం.

68. పూర్వ జన్మస్మృతి మనకు ఎందుకు కలగడం లేదు?

- స్మృతి - మనోశక్తి. అది భ్రాంతిలో ఒక భాగం. మాయాలో ఒక భాగం. భ్రాంతులైన పూర్వజన్మల గురించి తెలుసుకోవాలని నువ్వు ఎందుకు కోరుతున్నావు. నువ్వు ఆత్మగా నిలవగలిగితే, భూత, భవిష్యత్తులు లేవు. వర్తమానం కూడా లేదు. ఎందుకంటే, ఆత్మకాలాతీతం.

69. పునర్జన్మకు కారణం ఏమిటి?

- కోర్కెలు అసంపూర్ణమైన ఆశలు. కోర్కెలు నిన్ను తిరిగి ప్రపంచానికి తీసుకొస్తాయి. ప్రతి జన్మలో - ప్రతిదేహంలో నీ కోర్కెలు నెరవేరినట్లయితే నువ్వు కొత్త కోర్కెల్ని సృష్టిస్తూ - కోరుతూ వుంటావు. నువ్వు ఆత్మలోతుల్లో మునిగి తద్వారా పునర్జన్మను ముగించి అంతం చేయువలెను.

## 70. జన్మ - పునర్జన్మ వుందా?

- వాస్తవం చెప్పాలంటే మరణం లేనే లేదు. మరణం వుంటే జననం అనే ప్రశ్న ఉదయిస్తుంది. మనం దేహంతో తాదాత్మ్యం చెంది - అమృతాత్మను విస్మరిస్తే, అప్పుడు జననం - మరణం అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. మరణమనే దాన్ని సరిగ్గా అర్థం చేసుకుంటే దేహోహం అనే భావన తుదముట్టించుటే అవుతుంది. అదే దానికి సరైన అర్థం. నిజమైన జన్మ - నువ్వు నీ సహజస్థితిలో నిలకడ కలిగి వుండుట, అన్ని రకాలైన ఆలోచలనుంచి స్వేచ్ఛగా వుండుట, మూల కారణమైన దేహత్మభావాన్ని పరిత్యజించుట, అహంభావం అంతరించుట.

పునర్జన్మ వుందా?

- జన్మవుంటే - గతజన్మ - పునర్జన్మ వుంటుంది. 'ఎవరికి ఈ జననం?' అని విచారణ చేయవలసివుంది. 'నేను' అను తలంపు పుట్టుటే - నిజంగా పుట్టుట.

## 71. నేను దేవుడనని నిరంతరం తలంచుకుంటూ వుండవచ్చా?

- 'నేను ఇది - నేను అది, నేను ఇది కాదు - నేను అది కాదు? అనే దురభిప్రాయాలను, భావాలను, తలంపులను పూర్తిగా అణచి నాశనం చేయడానికి, 'నేను దేవుడను - నేను ఆత్మను' అని అనుకోవడం మంచిది, అభ్యాసికి. కాని అభ్యాసానంతరం మిగిలేది ఆలోచన కాదు, ఆలోచనకు అతీతమైన ఆత్మానుభవం.

72. ఉన్నది ఒకే ఒక ఈశ్వరుడు మాత్రమే అయితే మీరు భక్తుల నమస్కారాలు ఎందుకు అందుకుంటున్నారు?

- నేను ఎందుకు అందుకోకూడదు? వారు నాకు నమస్కారం చేసేముందు - నేనే ప్రతివారిలో వున్న ఈశ్వరునికి నమస్కారం చేస్తున్నాననే సంగతి మీకు తెలియదు.

73. సగుణాకరమైన ఈశ్వరుడు వున్నాడా?

- వున్నాడు.

ప్రశ్న - (అమితాశ్చర్యంతో) ఏమిటి వున్నాడా? మనలాగే కళ్ళు-ముక్కు- చెవులు వగైరాలతో వున్నాడా?

- అవును. అలాగే వున్నాడు. నీకు ఆ అవయవాలన్నీ వున్నప్పుడు దేవునికి ఎందుకు వుండకూడదు?

పురాణాల్లో, కబ్బాలలో, దేవునికి కూడా మనలాగే అవయవాలన్నీ వున్నాయని చదివినప్పుడు - నవ్వుకున్నాను.

- నీకు ఆ అవయవాలన్నీ వున్నప్పుడు, నిన్ను చూసి నువ్వు ఎందుకు నవ్వుకోలేదు?

నిరాకారమైన భగవంతునికి ఆకారాలు కలవని విశ్వసించడం నాకు చాలా కష్టం.

- ఎందుకు కష్టం? నీ మనసు దృశ్యాన్ని చూడనప్పుడు,

ఆలోచించనప్పుడు, గాఢనిద్రలో, మూర్ఛలో నిరాకారంగా వుండటంలేదా? పని చేయడానికి నీకు అనుబంధాలు కలిగి వున్నప్పుడూ, నువ్వు ఆలోచిస్తు న్నప్పుడూ, నీ దేహాన్ని పనులు చేయిస్తున్నప్పుడు - నీ మనసు విభాగాన్ని సృష్టించడం లేదా?

అలాగే నీ మనస్సు ఊహిస్తున్నప్పుడూ, నీ దేహం దానికదే పని చేస్తున్నప్పుడూ ఆ విషయాలకు ఎవరు ఎరుకలో వుండరు? అలాగే, దివ్యమైన చైతన్యం ఆలోచిస్తూ, నిర్ణయిస్తూ ప్రణాళిక వేసుకుంటూ వుంటుంది. అప్పుడు ఆలోచన - పనులు ఒక సంపూర్ణ - పరిపూర్ణ రూపం కలిగివుంటాయి. అవన్నీ ఆయన శక్తివల్లనే, శుద్ధ చైతన్యంలో అంతర్భాగ మైనట్టి ఈ నిర్మాణాత్మక, సృజనాత్మక శక్తిని అనేక పేర్లతో పిలుస్తారు. వాటిల్లో కొన్ని, మాయ-శక్తి వగైరా ఇంకా - నామ - రూప నిర్మాత అని కూడా ఉంటారు.

**74.** భగవద్గీతలో ఒక చోట కృష్ణుడు ఇలా అన్నాడు : ఈ విశ్వమంతా నా అభివ్యక్తమే - నా విభూతియే. నాకంటె ఇతరం ఏమీ లేదు. ఇంకోచోట - మరో అధ్యాయమంతా నేను నక్షత్రాల్లో చంద్రుణ్ణి, మానవుల్లో మహారాజుని మొదలైనవి. ఆ రెండు ప్రకటనల్ని ఎలా సమన్వయ పరచడం?

రెండోది - అర్జునుని సంశయానికి సమాధానం. 'నిరంతరం ధ్యానం ద్వారా నేను నిన్ను చేరడం ఎలాగ?' అనే ప్రశ్నకు నిన్ను ఎక్కడని గుర్తించడం.

- కృష్ణుని మొదటి ప్రకటనలోని సత్యాన్ని ఒకే సారి అర్థం చేసుకోలేనట్లు తేలుస్తోంది. అది అర్జునుని ప్రశ్నకు - సంశయానికి సంబంధించినది. కాబట్టి ఈశ్వరుడు తన దివ్య విభూతులను - మహిమలను అర్జునుని ధ్యానం కొరకు వివరించాడు. నిజం చెప్పాలంటే, అన్ని శాస్త్రాల్లో చెప్పబడినట్టి - ప్రబోధించినట్టి పూర్ణసత్యాన్ని నిరూపించడం లేదు. సాధకుని అవగాహనను అనుసరించి అవసరాన్ని బట్టి సత్యాన్ని నిరూపించవలసి వుంటుంది.

## 75. గురువు ఎవరు?

- భగవంతుడనే సాగరంలో తన వ్యక్తిత్వాన్ని పడేసి, దాన్ని మరచిపోయిన వాడే గురువు. అతను క్రమంగా దేవుని చేతిలో పనిముట్టు అవుతాడు. అప్రయత్నంగా, అనాలోచితంగా అతని ముఖతః దేవుని వాక్యాలు ఉచ్చరింపబడతాయి. అతను చేతులు పైకెత్తినప్పుడు - దేవుని శక్తి అతని చేతుల ద్వారా ఒక అద్భుతం చేస్తుంది.

# సామాన్య అభిప్రాయాలు

## 76. ఆధ్యాత్మిక అభ్యాసంలో మంచి మార్గం ఏది?

- మనం చూస్తున్న ఈ ప్రపంచం ఎంతగా ఆశ్చర్యకరంగా వుంటుంది. కాని అన్నింటికంటే అద్భుతం - విచిత్రం ఏమిటంటే, ఈ అన్నింటికి ఏకైక కారణం అనంతశక్తి., అదే మూలకారణమని

తెలుసుకోకపోవడం. 'ఈ దృశ్యమాన ప్రపంచాన్ని మనం చూడ్డానికి ఆ శక్తే కారణం' అని తెలుసుకోకపోవడం.

జననం - మరణం పరిణామ శీలమగు, జీవిత విషయాలయందు శ్రద్ధను వుంచకు. చూడ్డం కూడా ప్రధానాంశమని భావించకు. కాని వాటన్నింటిని చూసేదెవరో అతన్ని చూసి తెలుసుకోవడం ముఖ్యం అదే - అన్నింటికి మూలం. ఇప్పటి నుంచి నువ్వు చేసే ధ్యానం చూడ్డం మీద కాకుండా, ఇవన్నీ దేని చేత చూడబడుతున్నాయో - ఆ అచలమైన ద్రష్టమీద చిత్తయుంచి ధ్యానం చెయ్యి.

77. భగవాన్, నీ సన్నిధిలో వున్నప్పుడు, మేము ఒక విధమైన ప్రశాంతతను, పవిత్రతను అనుభవిస్తున్నాం. ఇక్కడినుండి వెళ్ళిన తర్వాత కూడా కొంతకాలం అది వుంటుంది. ఆ తర్వాత అది తొలగి - పాత, తెలివి తక్కువ పనులన్ని తిరిగి వస్తాయి. దానికి కారణం ఏమిటి?

- వాటన్నింటికి కారణం మనస్సు. బ్యాటరీలాగ అది కొంతకాలానికి శక్తిని కోల్పోతుంది. తిరిగి దాన్ని నింపుకోవలసివుంది. మనోనిగ్రహం పరిపూర్ణంగా వున్నప్పుడు, అప్పుడు ఇంక ఎటువంటి బాధలూ వుండవు.

78. స్వామీ, నేను మీ సన్నిధినుంచి వెళ్ళిపోతున్నాను. నేను తిరిగి ఎప్పుడు వస్తానో నాకు తెలియదు. నిరంతరం ఆశ్రమంలో మీ సన్నిధిలో నివసించు భక్తులు ప్రతి నిమిషం ఆనందాన్ని అనుభవిస్తారు. నాకు కూడా అటువంటి అనుగ్రహాన్ని కలిగించండి.

- ఫలానా వ్యక్తిని రక్షించాలి' అని అనుకున్న వాడు జ్ఞానికాదు. ప్రత్యేకతవుంటే, జ్ఞాని ఎలా అవుతాడు? తనకు శరణాగతి పొందిన వారిని ఈశ్వరుడు ఎల్లప్పుడూ రక్షిస్తూ వుంటాడు. కొలనులోని తామర పువ్వుక్రింద కప్ప వుంటుంది. కాని, ఎంతో దూరం నుంచి తుమ్మెద వచ్చి - దాని మకరందాన్ని గ్రోలుతుంది.

79. మహర్షి సేవ చేసి తరించాలనుకుంటున్నాను.

- ఈ వయసులో మీరు నాకు ఎటువంటి శుశ్రూష చేయగలరు? మీరు అటూ - ఇటూ తిరిగి ఏమీ చేయనవసరం లేదు. సాక్షాత్కారం పొందాలనే గట్టి పట్టుదలతో వుండండి. అదే మిమ్మల్ని అక్కడకు తీసుకు వెడుతుంది.

ఒక భక్తుడు - మరోభక్తునికి ఆశ్చర్యం కలిగేటట్లు "ప్రత్యేక సందర్భాల్లో తన పిల్లలైన మమ్మలను తమ చెంతకు చేర్చుకోవాలని భగవాన్ కోరుతూ వుంటారు' అన్నాడు.

భగవాన్ పాదాలు అంతటా కలవు. కనుక అతని పాదాల చెంత కాక మరెక్కడ చేరతారు మీరు? హృదయాలు చేరడానికి - కలపడానికి దేశ, కాలాలు అడ్డంకులు కావు.

80. నా 'విధి'ని నేను నిందించి శపించుకుంటున్నాను. నా భర్త నన్ను వదలి భగవాన్ సేవలో పూర్తిగా నిమగ్నుడై వున్నాడు. గృహస్థ జీవితంలో అతనికి ఎటువంటి ఆసక్తి లేదు.

- ప్రేమలోలుకు హృదయంతో, 'మీనాక్షీ!, నా మాటల్లో నీకు ఎందుకు విశ్వాసం లేదు? నువ్వు మురిసిపోతున్నట్టి గృహస్థజీవితంలో ఏం గొప్ప వుంది? నీ తండ్రికి పది మంది కొడుకులున్నారు. వారిలో ఏ ఒక్కరూ కూడా తండ్రికి ముద్ద పెట్టడానికి నోచుకోలేదు. నీ రక్షణ నీకు ఎప్పుడూ వుంది. ఇప్పటినుండి నిన్ను ఎవరైతే ప్రేమగా చూస్తారో వాళ్ళందరినీ కుటుంబ సభ్యులుగా గుర్తుంచుకో.

81. మా కుమారుణ్ణి తిరిగి ఇంటికి రమ్మని ఎంత బ్రతిమాలి ప్రయత్నించినా మేము విజేతలం కాకపోయాం. మమ్మల్ని ఏం చేయ మంటారు?

- హృదయపూర్వకంగా ఒక మార్గం ఎన్నుకున్న వానిని ఆ మార్గం నుండి వానిని తప్పించడానికి ప్రయత్నించడం ఎందుకు? తల్లి తండ్రులు అది వాళ్ళ ధర్మంగా భావించుకుని అతనిది తప్పు మార్గమైతే ప్రయత్నించ వచ్చు. కాని, అది నిజంగా మంచి మార్గం అయినప్పుడు - అక్కడ సమస్యే వుండదు కాదా?

82. నేను నా కొడుకు పెళ్ళి విషయం ఇప్పుడు ఎత్తడం లేదు.

- నీవు అనుకున్నా, అనుకోకపోయినా జరగవలసింది జరిగే తీరుతుంది.

83. నా కుమారుణ్ణి రక్షించమని నేను మీకు టెలిగ్రాం ఇచ్చినపుడు భగవాన్ నా బిడ్డను రక్షించాలనుకున్నారా?

- బిడ్డను రక్షించాలనే ఆలోచనే సంకల్పం. అటువంటి సంకల్పం కలవాడు జ్ఞాని కాలేడు. నిజం చెప్పాలంటే, అటువంటి ఆలోచన అవసరం లేదు. జ్ఞానిదృష్టి దేని మీదనైనా పడితే, అది ఎంతో మేలు చేయడానికి జరిగివుంటుంది.

84. నా భర్త ఎప్పుడూ మీ వద్దకు రావడం తుదకు అతను సన్యాసిగా మారతాడని భయపడుతున్నాను. దయచేసి అతన్ని ఇంట్లోనే వుండి పొమ్మని చెప్పండి.

- సంసారం, లేక గృహస్థ జీవితాన్ని దాటుట బలవంతమైన పనిద్వారా జరగదు. కర్ర ఆధారం చేసుకుని నడుస్తున్న వాని కర్ర అది ఆయన చేతిలోనే వుంటుంది. కాని, నిద్రపోయినప్పుడు ఆ కర్ర దానికదే జారి పడిపోతుంది.

85. మహర్షి - అజ్ఞానులను ఉపదేశాల, ఉపన్యాసాల ద్వారా ఎందుకు ఉద్ధరించకూడదు?

- దేవుడు పని చేయడం లేదా? ఆయన ఉపన్యాసాలిస్తున్నారా? మాటల ద్వారా పని జరుగుతుందా? సంభాషణ ఉపన్యాసం ఏమీ లేకుండా ఎన్నో మహత్తరమైన పనులు జరగగలవని మీకు తెలియదా?

86. మహర్షి తన మహాశక్తిని మహాత్మా గాంధీతో చేర్చి, భారత మాత దాస్యశృంఖలాలను ఎందుకు త్రెంచరాదు?

మహర్షులు ఎలా పని చేస్తారో తెలుసుకోవాలని కోరుకున్నావు.

అలాగే ఇతరుల సమస్యలు తెలుసుకోవాలనుకుంటున్నావు. నువ్వు నిజంగా ఏమై వున్నావో నీకు నువ్వు తెలుసుకునేవరకు నీకు ఈ విషయాలేవో కూడా ఏమాత్రం అర్థం చేసుకో లేవని నేను చెపుతున్నాను. ముందు నిన్ను నీవు తెలుసుకో. తర్వాత ఇతర విషయాలన్నీ నీకు తేటతెల్లమౌతాయి.

కొంతసేపైన తరువాత మహర్షి ఇలా అన్నారు -

స్వామి వివేకానంద చెప్పిన సంగతి ఒకటి వుంది. ఒక ఋషి ఒక గుహలో కూర్చున్నాడు. అయినా అతని ఆలోచనా శక్తి ప్రభావం యావత్ ప్రపంచం మీద పని చేస్తుంది అని. అది అక్షరాలా నిజం.

**87. దుఃఖితులైనట్టి - బాధితులైనట్టి మానవుల గతి ఏమిటి? ప్రపంచంలో వున్న ఎంతో బాధకు, దుఃఖానికి నివారణ మార్గమేమిటి?**

- నీ దుఃఖానికి, బాధకు కారణం తెలుసుకోకుండానే లోకుల దుఃఖాలను నివారించాలని నువ్వు ఎందుకు ఆరాటపడతావు?

**88. స్త్రీలు - ప్రణవ జపం చేయవచ్చునా?**

- ప్రణవ జపంతో సహా అన్నీ సాధనల చివరి లక్ష్యం జ్ఞానమే. ఎటువంటి సాధన ద్వారానైనా జ్ఞానాన్ని పొందడానికి ప్రయత్నించినా - దానికి స్త్రీ - పురుష బేధం ఏమీ లేదు. భగవాన్ మళ్ళా అన్నారు.

"ప్రజలు సర్వసాధారణంగా తాము చేసే సాధనకు తరచుగా అతుక్కుని, బంధీలై అదే పరమావధి అనుకుంటారు. ప్రపంచంలోని అన్ని సాధనలు ప్రాణాయామం వాయునిరోధం జపం, యోగం మొదలైనవి అన్నింటి యొక్క ప్రయోజనం సామాన్యంగా మనో నిగ్రహమే కాబట్టి ఈ సంశయాలన్నీ కలుగుతున్నాయి.

**89. ఈ ప్రపంచం మిథ్య - అని అనడంలో అర్థం ఏమిటి?**

- (ఆశ్చర్యంగా) దాని అర్థం ప్రపంచం నిజమని. (ఆ తర్వాత భగవాన్ సంస్కృత శ్లోకం చదివారు) అజ్ఞానంతో చూస్తే, ఈ ప్రపంచం అబద్ధమే. కాని, అదే ప్రపంచాన్ని బ్రహ్మగా జ్ఞానంతో దర్శిస్తే అది వాస్తవమే.

**90. ప్రపంచం ఆహంకారం దేహం అన్నీ ఒకటేనా?**

- అవును. అవి అన్నీ అంతా ఒకటే వస్తువు. మనస్సు లేనిదే ప్రపంచం వుండదని, అహంకారం లేనిదే మనస్సు వుండదని, దేహం లేనిదే అహంకారం లేదని నువ్వు తెలుసుకోగలవు.

**91. దేహాన్ని వదలిన అహంకారం వెంటనే నూతన దేహాన్ని ధరిస్తుందా?**

- తప్పకుండా, దేహం లేనిదే అది వుండలేదు.

**92. అప్పుడు అది ఎటువంటి దేహాన్ని ధరిస్తుంది?**

- అది స్థూల దేహం కావచ్చు - సూక్ష్మదేహం కావచ్చు.

93. ఒక బాలుడు - భగవాన్ మీరు నాతో కలసి మాపూరికి రండి.

- నేను నీతో కలసి రావడం లేదని నీవు ఎందుకు అనుకుంటున్నావు? నీవు నన్ను నీ హృదయంలో పెట్టుకుని తీసుకువెళ్ళిపోవచ్చు.

94. సిద్ధులకోసం ప్రయత్నించకూడదా?

- జ్ఞానమార్గంలో ప్రయాణించువారు, జ్ఞానయోగ సాధకుడు సిద్ధుల విషయంలో జాగ్రత్తపడవలసి వుంది. సిద్ధుల వాటంతట అవి అతన్ని వరించినా, జ్ఞానయోగ సాధకుడు వాటిని నిరసించవలె.

95. ఆధ్యాత్మిక జీవితంలో సిద్ధులకు - మహిమలకు వున్న ప్రాధాన్యం ఏమిటి?

- అతీంద్రియ శక్తుల గురించి అధికంగా ఆలోచించవద్దు, వాటి సంఖ్య అనంతం. దూరదర్శన దూరశ్రవణం మొదలైన శక్తులు సంపాదించ వలసినవి కావు. వాటికంటే తేజోమయమైన శాంతికరమైన మార్గములు సహాయం లేకుండానే శాంతి కలిగే అవకాశముంది. గురువులు మాత్రం ఆత్మార్పణ కోసమని వాటిని తీసుకుంటారు. సర్వ సాధారణంగా గురువులు వాటికోసం చూడరు. ఎందుకంటే దైనందిన జీవితంలో వారికి వాటి ఉపయోగమే లేదు.

96. నేను మహర్షి నుంచి ఎందుకు ఏదీ పొందలేక పోయాను?

- నువ్వు ఏదీ కోల్పోలేదు కాబట్టి, ఏదీ పొందవలసిన పని లేదు.

97. దయచేసి నిజమైన బ్రహ్మచర్యం గురించి చెప్పండి.

- బ్రహ్మలో వుండి, బ్రహ్మలో చలించి జీవించుటే నిజమైన బ్రహ్మచర్యం. సాధారణ బ్రహ్మచారులు ఆ స్థితి పొందడం చాలా అవసరం. నువ్వు దేహతాదాత్మ్యం కలిగి వున్నంతవరకు కామవాంఛవల్ల కలిగినట్టి మనో వికారం నుండి విముక్తి పొందలేవు. నీవు కేవలం శుద్ధ నిరాకార చైతన్యమని తెలుసుకుంటే కామవాంఛల వికారాల నుండి విముక్తుడవు అవుతావు. అదే సహజమైన అప్రయత్నమైన బ్రహ్మచర్యం.

98. కావలసినంత వైరాగ్యం, నిస్సంగత్వం లేకుండా ఎవరైనా భగవాన్ని చేరగలరా?

- ఆ స్థితిని ఎప్పుడో, ఎక్కడో పొందాలనుకోవడమే భ్రమ. కాని, నీ నిజస్వరూపాన్ని నీవు ఎరిగినట్లయితే, నీవు ఆత్మను ఎరిగివుంటే ఇంక నువ్వు దేన్ని పొందవలసి వుంటుంది? వైరాగ్యమే మన నిజస్వరూపం.

99. భగవాన్, ప్రజలు నన్ను మూఢాచార పరాయణుడని నిందిస్తున్నారు.

- నువ్వు కూడా వారిని ఎందుకు నీకంటే అధికమైన విగ్రహారాధకులని అనలేకపోయావు? ఎందుకంటే వారు నిత్యం రోజులో చాలా భాగం ఒంటికి స్నానం చేయించడం, దుస్తులు ధరించడం ఆహారం పెట్టడం ద్వారా వారే తమ దేహాన్ని ఎన్నో సార్లు అనేక విధాల

కావాలని ఆరాధిస్తున్నారు. అన్నింటి కంటే, ఈ దేహం పెద్ద విగ్రహం కాదా? కనుక ఎవరు విగ్రహారాధకులు కారు?

100. హఠయోగ ప్రక్రియలు రోగాన్ని నివారించే శక్తి కలవనీ కనుక అవి జ్ఞానయోగ సాధనకు ప్రాథమిక అవసరాలని చెప్పబడివున్నాయి.

- వాటిని ఉపయోగించువారికి, ఉపయోగించుగాక. అవి ఇక్కడ అనుభవం కావు. నిరంతర ఆత్మవిచారణ వలన అన్ని విధాలైన రోగాలూ నశించగలవు.

శ్రీ రమణార్పణమస్తు:

